# IN MEMORIAM

*

MY LITTLE DAUGHTER "BABY" aged 7
who died of typhoid on 14-11-35.

*

In this world all things do die,
No need to sigh
And wish things to stay,
For, we too pass away —
Pass away as a dream.
Lights will cease to burn.
When the sustaining oil is over;
Men to corpses turn,
When the heart beats no more;
Birds may cease to twitter,
Friendships with graves forgotten,
It all may seem little :
No need to sigh,
For, we too soon die.
From Light to dim Darkness
All things will fade
And die in the shade ;
Mortal things will die;
No need to sigh.

*

**The promising author of this poem—**
**my niece "PREMA" aged [illegible]**
**also passed away on 19-1-3[illegible]**

—[illegible]A RAO.

# "అంకుల్ టామ్"

## కథాసందర్భము.

నీగ్రో బానిసల ఘోరస్థితిగతులను దెలుపుచు నీయన్యాయమును బాపుటకు తోడ్పడిన గ్రంథములలో 'అంకుల్‌టామ్సు కాబిన్' అను ఆంగ్లనవల సుప్రసిద్ధమైనది. హెరియట్ బీచర్ స్టౌ అను అమెరికాదేశపు నారీరత్నము దీనినిరచియించి 1852 లో ప్రకటించెను. ఇదిపెక్కుభాషలలోని కనువదింపబడి రమారమి యొక కోటి ప్రతులు ప్రకటింపబడినవి. పదునైదులక్షల రూపాయలు వ్యయపరచి ఈకథను అమెరికావారు సినీమాఫిల్ముగా చేసి ప్రదర్శించుచున్నారు.

అమెరికాఖండమునందు నేడు తెల్లవారు గొప్ప నాగరకరాజ్యములను స్థాపించి సౌఖ్యము ననుభవించుచుండుట నెల్లరెఱుగుదురు. పదునైదవ శతాబ్దికిబూర్వ మీ అమెరికాదేశమున తెల్లవారు లేరు. దేశమున పాడిపంటలు లేవు. అప్పటి ఆదిమవాసులు ఎఱ్ఱనిదేహచ్ఛాయగల వీరజాతివారు. వీరిని పాశ్చాత్యులు ఎఱ్ఱయిండియను లని వ్యవహరించిరి. వీరి కొకవిధమగు నాగరకత, మర్యాద, జీవనవిధానము కలవు. వారు మనదేశములోని

కోయదొరలవలె నుండిరి. అమెరికా దేశమును గను
గొని తెల్లవారచ్చుట వలన నేలలోని బంగారుగనులు
త్రవ్వుట పాడిపంటలను వృద్ధిచేసికొనుట మొద
లిడిరి. వారికీ పనులు చేయుటకు మనుష్యులు
కావలసియుండిరి. అచ్చటి ఎఱ్ఱజాతివారు ఒడలు
వంచి పనులు చేయరు. పైగా వారు శూరులు.
మన దేశమునందువలె అచ్చట తెల్లవారికి చౌకగ
కూలినాలి చేయువారు లేరైరి. తెల్లవా రిది చూచి
ఒకమార్గము గనిపెట్టిరి. ఆఫ్రికా దేశములోని నీగ్రో
జాతివారు దృఢకాయులు. వారి యాకారము వికృ
తముగ నుండునుగాని హృదయములు కోమలములు.
వారికి పెక్కు పిచ్చినమ్మకము లున్నను పరమేశ్వరు
నందు భయభక్తులు కలవు. తోడిమానవుని సులభ
ముగ విశ్వసింతురు. వీరు మన వెఱ్ఱిగొల్లలవంటి
సాధుజనులు. ఈ వెఱ్ఱిబాగులవారిని తెల్లవారు
తమకు బానిసలుగ జేయదలచిరి. అంతట నీ నల్ల
వారిని పట్టుకొని విక్రయించు వ్యాపారము సాగెను.
నయమునను భయమునను, మోసము జేసియు
బలవంతముగను, నీగ్రోలను ఓడలలోని కెక్కించి
వారి కాళ్లకు చేతులకు నినుపశృంఖలలు తగిలించి
వానికి గొలుసులువేసి మృగములవలె కట్టివైచి వేల
కొలదిమైళ్ల దూరమున నున్న అమెరికా కెగుమతి

చేయసాగిరి. రక్తమాంసములు విక్రయించుట
కలవాటుపడినవారికి ధర్మచింతగాని భూతదయగాని
యుండవు. అందువలన మార్గమధ్యమున నీ నీగ్రోలు
పడు బాధలకు మేర లేదు. వారికి శుభ్రమగు
ఆహారపానీయము లీయరు సరికదా బంధములైన
సడలింపరు. మలమూత్రము లచటనే విడువవల
యును. మశూచివంటి ఘోరములగు అంటువ్యాధుల
వలన పెక్కురు మరణించుచుండిరి. చచ్చిన శవము
లనుగూడ యెప్పటి కప్పుడు పారవేయువారు గారు.
శవములు కుళ్ళుచుండెను. ఇట్లు పోగా మిగిలిన
వారిని బానిసలుగ విక్రయింతురు. ఈవ్యాపారము
చాల లాభకరముగ నుండెను. ఒక్కొక్క బానిసకు
పదివందలు మొదలు పదునైదువందల రూపాయిలు
కూడ విలువయుండెను. ఇక బానిసల గొన్నవారికి
వీరిపై దయాదాక్షిణ్యము లెక్కడివి? వీరిచే పసర
ములవలె పనిచేయించుచుండిరి. పసరమునకైనను
విధివిరామములు కలవు కాని, వీరికి లేవు. నీచ
ముచ్చము లేదు. అవిధేయత చూపిన బానిసకు
చావు నిక్కము. నూటి కొక్క యజమానుడు
కొంచెము దయగలిగియుండునుగాని అతడు శాశ్వత
మగు టెట్లు? హెచ్చుగ పురుషులు తక్కువగ
స్త్రీలును బానిసలుగ గొనిరాబడుటవలన వ్యభిచా

రమునకు గారణ మయ్యెను. వివాహ నియమము లుండుటకు యజమాను లంగీకరింపరు. భార్యభర్త లను విడదీయుదురు. బలవంతముగ దంపతులకు వేరు వేరుగా పునర్వివాహములు చేయుదురు. ఇదిగాక తెల్లయజమానులు తమకు కామేచ్ఛ జనియించి నప్పుడు కనబడిన స్త్రీని చెఱచుచుందురు. ఇట్లొక సంకరజాతి బయలు దేరెను. నల్లనీగ్రోలేగాక ఈ తెల్లసంకరజాతివారుకూడ బానిసలుగనే విక్రయింప బడుచుండిరి. అంతట కొంచెము తెలుపువన్నెగల బాలికకు మానము దక్కుటయే కష్టమయ్యెను. అట్టివారికి విలువయు నధికమయ్యెను. యజమాను నకు కావలసినప్పుడెల్ల తల్లినో తండ్రినో పిల్లలనో విక్రయించివేయును. యజమాని చనిపోయినచో నాతని బానిసలగతి వర్ణనాతీతము. బానిసల బంధు గులను స్నేహితులనుగూడ వేరుచేసి నలుప్రక్క లకు గొడ్లవలె తోలుదురు. యజమాని ఋణముల పాలైనచో నే సమయమున నే ఋణదాత వచ్చి యీ మానవపశువులను చరాస్తిగా జప్తుచేయునో తెలియదు. యజమానుల కీ చరాస్తిపైన దాన దమనవినిమయవిక్రయాద్యధికారములు కలవు. క్రూరుడగు యజమాని తన బానిసను చర్మపు కొరడాతో కొట్టి చంపినను అడుగువారు లేరు. ఆ

హత్యానేరమునకు సాక్ష్య మెవరు వత్తురు? తెల్లవారి న్యాయస్థానములందు నల్లవారికి న్యాయము దొరక కుండెను. ఒకవంక అమెరికా దేశములోని తెల్లవారు సకలసంపదలతో తులతూగుచు సకలసౌఖ్యము లనుభవించుచుండగ నీ నిర్భాగ్యులు లక్షలకొలది అజ్ఞానమున అనారోగ్యమున బడియుండిరి. వీరికి చదువు చెప్పుట సాహాయ్యము చేయుట నేరము.

అమెరికా సంయుక్తరాష్ట్రములందిబానిసతనమునకు హద్దులు లేవు. వారి బాధలకు మితిలేదు. బానిసలవిషయమున మొదటినుండి ఉత్తరఅమెరికా కెనడా రాష్ట్రములవారు కొంతదయ గలిగియుండిరి. అచ్చట నీగ్రోలు స్వేచ్ఛగ జీవించుట కవకాశము లుండెను. 1860 నాటికి కెనడాలో నాలుగు లక్షలు స్వేచ్ఛ పొందిరి. అప్పటికి అమెరికా రాష్ట్రములందల్ల 50 లక్షల బానిస లుండిరి. దక్షిణరాష్ట్రముల నుండి కొందరుబానిసలు కెనడాకు పారిపోవు చుందురు. ఈ కాలమున తెల్లవారిలో గూడ కొందరు సత్పురుషులును స్త్రీలును బానిసలయెడ దయ గలిగి వారిని రక్షించి ఆదరించుచుండిరి. వీరిలో 'క్వేకరు'లను క్రైస్తవ మతశాఖకు చెందినవారు సుప్రసిద్ధులు. ఇన్ని బాధలు పడుచు బానిస లెట్లో జీవించుచుండిరి. కొందరు రహస్యముగ చదువనేర్చిరి.

వీరి బాధలుచూడగా చాలమంది హృదయములు కరుగసాగెను. ఎట్టకేలకు 1860 నాటికి ఈ బాని సత్వముబాపుట అను సమస్యయే రాజకీయ ఎన్నిక లందు ప్రధానస్థానము వహించెను. అబ్రహాం లింకను బానిసత్వమునకు విముఖుడు. అమెరికా సంయుక్తరాష్ట్రములకు ఇతడధ్యక్షుడయ్యెను. ఇతడు బానిసతనమును బాపెను. బానిసతనము పోకూడదని దక్షిణరాష్ట్రములు చాల ప్రియత్న ములు చేసెను. గానిలాభము లేకపోయెను.

ఈ అన్యాయము పోయినను నేటికిని నీగ్రోజాతి వారిబాధలు పూర్తిగా మానలేదు. దేశములోని తెల్లవారు నీగ్రోలను తమతో సమానులుగ పరిగ ణింపక మనదేశమునందలి అంటరానివారినిమనము జూచునట్లు చూడసాగిరి. ఎంత విద్యావంతులైనను ఎట్టి సద్వర్తనము గలిగివారైనను ఎంత తెల్లగ నున్ననుగూడ నీగ్రోరక్తస్పర్శముగలదని తెలిసి నచో ఆ స్త్రీపురుషులకు రాజకీయ సాంఘిక మత వ్యవహారములందు పూజ్యత, గౌరవము, లేక పోగా అవమానములు తప్పవు. రైళ్లలో హోటళ్లలో పాఠశాలలలోతుదకు క్రైస్తవ దేవా లయములందు సైతము అంటరానితనము కనబడు చున్నది. తెల్లవారితోపాటు నీగ్రోస్వేచ్ఛను

పొందెనేగాని తెల్లవారి హృదయములు మారలేదు. అయినను స్వాతంత్ర్యము పొందినపిదపన్వయంకృషి వలన తెలివితేటలవలన మంచితనమువలన ఈజాతి స్త్రీ పురుషులెల్లరు బాగుపడి తెల్లవారికన్న గూడ గౌరవ్యులు కాదగి యున్నారు. అమెరికాలోని న్యాయస్థానములందు సైతమెక్కొకప్పుడు నీగ్రోలకు న్యాయము దొరుకుటయె దుర్లభమగుచున్నది. నీగ్రోలయెడల తెల్లవారికి సానుభూతి యుండుట అరుదు. నీగ్రోవానికి తెల్లస్త్రీతో సంబంధము కల దని తెలిసినచో తెల్లవారి మూకలకు కలుగు క్రోధావేశమునకు మితియుండదు. న్యాయస్థానమున నేరము రుజువుచేయబడువరకుగూడ వేచియుండక బలవంతముగ వానిని చేజిక్కించుకొని చిత్రవధలు చేయుట నేటికిని జరుగుచున్నది.

భారతదేశ హరిజన సమస్యతో పెక్కు పోలికలు గల అమెరికా నీగ్రో సమస్యవలన మనము నేర్చుకొనతగిన నీతులనెల్ల ఈ కథ మనకు బోధించుచున్నది.

# 'అంకుల్ టామ్' కథ.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో కెంటకీఅను రాష్ట్రమున ఒక పట్టణమున షెల్బీఅను పేరుగల తెల్లకుటుంబమువా రుండిరి. ఈ షెల్బీదంపతులు చాల మంచివారు. తమ బానిసలను బిడ్డలవలె చూతురు. వీరి నీగ్రో బానిసలలో "టామ్" అను నతడు చాలబుద్ధిమంతుడు. దైవభక్తిగలవాడు. షెల్బీ తండ్రికాలముననే నితడీ కుటుంబమునకు బానిస. షెల్బీని పెంచిన దితడే. "క్లో"అను నామె యతనిభార్య. వీరికి ముగ్గురు పిల్లలుండిరి. టామునకు ఎంతధనమిచ్చి ఎక్కడికిపంపినను పారిపోవునను భయములేదు. ప్రొద్దున మొదలు సాయంతనము వరకు తన యజమానుని పనులెల్ల చక్కబెట్టుటలో నేమాత్రము నేమరడు. "క్లో"కూడ యజమానునింటి వంటపనులెల్ల చక్కగ చేయుచుండెను. షెల్బీ యు నాయన భార్యయు కొమరుడగు జార్జియు నీ బానిసకుటుంబమునెడల చాల దయకలిగియుండిరి. టామునకు షెల్బీ కుటుంబమన్న ప్రాణము. జార్జిపైన పుత్రప్రేమ. టాము క్రైస్తవుడు. పెక్కురు తెల్లవారికన్న టామునం దీశ్వరభక్తి యధికతరముగ నుండెను. ఏసుక్రీస్తుపద

మునుబట్టి నడువవలెనని యాతడెల్లప్పుడు ప్రయత్నించును. ఇతనినెల్లరు "టాము మామయ్యా" అని పిలుచుచుందురు. ఇతడు నితనికుటుంబమును షెల్బి గారియింట సుఖముగ జీవించుచుండిరి.

షెల్బీపనికత్తెలలో 'ఎలిజా' అనునామె చాల రూపవతి. ఆమె బానిసపడుచైనను ఆమెవంకె తలవెండ్రుకలు చక్కని తెల్లని మోము చూడగ నామె తెల్లవారి యూడుపడుచువలెనే యుండును. ఈమెను చాల చిన్నతనముననే షెల్బీ కొనితెచ్చెను. అదృష్టవశమున నీమె కీడుజోడునగు "జార్జిహారిస్" అను నొక చక్కని బానిసయువకు డీమెకు వరుడయ్యెను. షెల్బీగారిభార్య ముచ్చటపడి వీరిద్దరికి పెండ్లిచేసెను. జార్జి హారిసుకూడ చాలా రూపసి. మంచి తెలివి తేటలుకలవాడు. వేషభాషలుచూచినచో నీగ్రోజాతివాడని ఎవ్వరు ననుకోనరు. ఈ దంపతులకు ఇరువురు బిడ్డలుపుట్టి పోయినపిదప నొక చక్కని కుమారుడు కలిగెను. జార్జిహారిస్‌యొక్క యజమానుడు కడు క్రూరుడు. వాడితని నొకకర్మాగారమునకు కూలికి కవులుకిచ్చెను. ఈయువకు డా కర్మాగారమున నొక క్రొత్తయంత్రమునుచేసి తన తెలివి తేటలు గనుపఱచి పనిచేసెను. యంత్రము చేసెనే గాని ఆయంత్రమువలని లాభమును వీడు పొందు

టకు పీలులేదు. దానియందలి స్వామ్యములెల్ల యజమానివే. ఒకనా డాయజమానుడువచ్చి జార్జి పొందుచున్న గౌరవమునుచూచి ఓర్వలేక ఈబానిసాధమునకింత గౌరవమేమిటి? అని కర్మాగారము నుండి తీసికొనిపోయి తనపొలమున పేడపిసికించుట మున్నగు నీచపుబనులు చేయించుచు చీటికి మాటికి వానినిగొట్టుచు తన యాజమాన్యపు గరువమెల్ల చలాయించుచు నతనిని హింసింపసాగెను. అంతటితో నూరకొనక "చక్కని పెండ్లాముగలదని నీకు పొగ రెక్కినది; దానిని వదలి ఇంకొక దానిని పెండ్లాడె దవా లేదా" అని నిర్బంధింపసాగెను. ఆ కాలమున బానిసలకు వివాహయోగ్యతలేదు. వారి పెండ్లిండ్లు గౌరవించువారు లేరు. వారికిమానవసత్వములులేవు. బానిసయనగ యజమానునివస్తువు. ఆ వస్తువును చితుకగొట్టవచ్చును. ఛేదింపవచ్చును. విక్రయింప వచ్చును. ఇచ్చవచ్చినట్లుచేయవచ్చును. అందువలన జార్జిని రక్షించువారులేరు. జార్జి తనపెండ్లాముదగ్గర కన్నీరుమున్నీరుగ నేడ్చెను. నేను జన్మింపకపోయినను బాగుండెడి దనెను. అయ్యో ఇట్టి బానిసత్వము ననుభవించుటకేనా యీ బాలకునిగూడ గంటిమి! పాపపు దైవము మనల నేల సృజింప వలయునని వేడినిట్టూర్పునూర్చెను. ఈ పెల్సీగారెంత మంచి

వాడైననేమి? పాపపు బానిసత్వపద్ధతి ఎట్లుపోవును? ఏది ఎట్లుజరుగునో ఎవ్వడెరుగును? ఈ యజమాని పరమపదించినగాని ఇంకొక విధమైనగాని మీ గతి ఏమి? అని వగచి 'లాభములేదు, నేను వారములోజులలో కెనడారాజ్యమునకు పారిపోయెదను. బ్రతికి యుండినచో మిమ్ములనుకూడా విడిపించెదను' అని నిట్టూర్పు నూర్చి వెడలిపోయెను గాని ఆ రోజున తన భార్యకు బిడ్డనికి కలుగు ఘోరవిపత్తు కలనైన దలప డయ్యెను.

షెల్బీగారు చాలమంచివాడేగాని ఋణములలో పడిపోయెను. ఒక బానిస వర్తకుడు, హాలే అను వాడు షెల్బీగారి ఋణపత్రములను చేజిక్కించుకొనివచ్చి టామును ఎలిజా కొమారుడగు హారీని తనకు విక్రయించినచో ఋణవిముక్తి చేసెదననియు లేనిచో సర్వనాశనము చేసెదననియు నిర్బంధింప సాగెను. షెల్బీకిది యిష్టము లేకపోయినను వారిని విక్రయించుట కంగీకరింపవలసి వచ్చెను. ఎలిజా కీసంగతి తెలిసి హారీని చంకనిడికొని ఆరాత్రి ఆమంచులోపడి కాలినడకను పలాయనమై నడచినడచి డస్సి, 'ఓహియో'నదిని ఆరాత్రి దాటుట దుర్లభమని తలచి ఆ నదీతీరమున నొక వంట పూటింట విడిసెను. ఈలోపున హాలే కొన్ని వేటకుక్కలను

వెంటబెట్టుకొని తానుకొనిన బానిసను వెదకి వేటాడు
టకు బయలుదేరెను. ఎలిజా యెట్లయినను తప్పించు
కొనునుగాకయని, షెల్బీగారిభార్య వేయి దేవుళ్లకు
మ్రొక్కుచుండెను. హాలే తుదకు ఆ వంటపూటిం
టికి పోవగనే ఎలిజా భీతిల్లిన లేడివలె లేచి బాలుని
జంకనిడికొని ప్రాణములకు తెగించి ఒహియోనది
పైన తేలుచున్న మంచుగడ్డలపైననే నడచిపోదలచి
ఒక దానిపైనుండి ఇంకొక దానిపైకి దుముకుచు
నదిని దాటిపోయి ఆవలియొడ్డు చేరెను. ఆ కాలమున
దొంగసాక్ష్యము లిచ్చి బానిసలను పట్టియిచ్చుటయే
పనిగా జీవించువారు కొందరుండిరి. ఎలిజాను పిల్ల
వానిని బట్టుకొనుటకు అట్టి దుర్మార్గులను నియ
మించి హాలే మరలివచ్చి టామును వెంటనిడికొని
పోయెను. షెల్బీగారిభార్య టాముతో "మాచిక్కు
లు తీరినపిదప నిన్ను మరల కొనితెచ్చెద"నని
కన్నీటితో పలికెను. దారిలో హాలే ఇంకొక స్త్రీని
బాలుని గొని స్టీమరెక్కెను. మార్గమధ్యమున
అతడు ఆబాలు నింకొకని కమ్మివైచెను. ఆ దుఃఖము
భరింపలేక ఆ స్త్రీ నదిలోదూకి మరణించెను. కాని
హాలేకిది ఒక వంద రూపాయిలనోటు పోయినట్లుగా
తోచెనేగాని నిండు ప్రాణము పోయినట్లు తోచ
లేదు! టాముయొక్క అదృష్టవశమున లూసియానా

జిల్లా కాపురస్థుడగు 'అగస్టైన్ సెంట్ క్లేర్' అను నొక కరుణాత్ముం డా స్టీమరులో ప్రయాణము చేయుచుండెను. ఆయనకొమార్తె "ఈవా" అను బాలిక చాల దయార్ద్రహృదయ. టాము ఆమెను మచ్చిక చేసికొనగలిగెను. ప్రమాదవశమున నామె నీటిలో బడగా టామామెను రక్షించెను. అంతట ఈవా కోరగా నామెతండ్రి టామును కొనివేసెను.

సెంట్ క్లేరుదగ్గరనున్న బానిసలెల్లరు చాల సౌఖ్యము లనుభవించుచుండిరి. తక్కిన యజమానులవలె అగస్టైను వారిని జీటికి మాటికి కొరడాలతో కొట్టడు, తిట్టడు, హింసింపడు, సరికదా వారికిచాల చనవిచ్చి దయతో జూచుచుండును. వా రితనిని తమతండ్రివలె చూచుకొనుచుండిరి. నీగ్రో చర్మము నల్లనిదైనను ఒడలిరక్త మాంసములు తెల్లవారి వంటివేకదా! అనియతడు పలుకును. తక్కిన తెల్లవారికిది యిష్టములేదు. ఈవాతల్లి ఎల్లప్పుడు నేదో జబ్బుఅని మూలుగుచునే యుండును. అందువలన ఇంటిని చక్కబెట్టుటకును ఈవాను సంరక్షించుటకును సెంటు క్లేరు తనబంధుగురాలగు ఒఫీలియా అను నామెను కొన్నాళ్ళు తనయింట నుండుమనెను. ఒఫీలియా పైకి కఠినురాలివలె కనబడినను బానిసత్వ

మన్న నిష్టములేని ఉత్తరరాజ్యములం దామె పుట్టి పెరిగిన దగుటచే బానిసత్వ మన్న నీమెకును గిట్ట దు. అయినను తెల్లవారికి నల్లవారనగా నుండు నస హ్యాము మాత్ర మీామెకును కలదు. అగస్టయిను తన బానిసలకు చనవిచ్చి పాడుచేయుచున్నాడని ఈమె అభిప్రాయము. కాని ఈమె ఆబానిసల సోమరి తనమునకు వారిని తిట్టకయె పనులెల్ల తానే నిర్వ హించుచుండును. తక్కిన తెల్లవారివలె తమపైన అధికారము చలాయించుచు నూరక గూర్చుం డక ఈ తెల్లస్త్రీ సామాన్యపు బనులెల్ల చేయుట చూడగా నీబానిసలకును వింతగ నుండెను. అంతే కాదు అలుసుగనుండెను. ఈమె గొప్పయింటివారి యాడుపడుచుగ వారికి కనపడలేదు.

ఒక కల్లంగడిలో "టాప్సీ" అనునొక నీగ్రోబా లిక ఎల్లప్పుడు హింసింప బడుట అగస్టయినుకంట బడెను. అతనికి కనికరముగలిగి ఆ బాలికను కొని తెచ్చి ఒఫీలియావశము జేసెను. "మనకున్న కోతులమూక చాలదా? దీనినిగూడ ఏల కొని తెచ్చి తి"వని ఒఫీలియా అనెను. తక్కిన బానిసలు కోతు లైనచో నీ బాలిక కొండముచ్చు అను సంగతి శీఘ్రముగనే విదితమయ్యెను. దీనికి చాలా తెలివి తేటలు కలవు. బుద్ధిపుట్టెనా ఎన్ని పనులైన చే

యును; చక్కగ చేయును; కాని బుద్ధిమాత్రము పొట్టదు. ఎల్లప్పుడేదో యొక కొంటెపని చేయును- ఎల్లప్పుడేదో దొంగిలించును- కల్లలాడును. నీవు చేసినతప్పు ఒప్పుకొనుమని ఒఫీలియా బెదరించినచో ఉన్నవి, లేనివి, కూడా తానే చేసితి ననును. నీవేల యిట్లు చేయుచున్నావనగ "నేను దుర్మార్గురాలను కాబోలు! కొరడాతో నన్ను కొట్టండి, నా కది అల వాటు" అనును. ఒక్కమారు కొట్టగా ఇల్లు గగ్గోలుచేసి, ఒఫీలియా వెనుదిరుగగనే ఇగిలించి "అబ్బే ఈ దెబ్బలొక లెక్కా! కల్లంగడిలో నన్ను బాదిన బాదులలో నిది ఎన్నవవంతు?" అనెను.

ఈవాయొక్క దయ, దాక్షిణ్యము, నెమ్మది, నీగ్రోబానిసలను ఆబాలగోపాలము నాకర్షించుచుం డును. ఎవ్వరిని కొట్టుటకు తిట్టుటకు నామెఅంగీకరిం పదు, తనతల్లి అందరిని తిట్టుటచూచి ఈమె వగ చును. సజ్జను లీ యుర్విపై చిరకాలముండరు.ఆమెకు క్షయరోగము పుట్టి వర్ధిల్లెను. ఇక చాలకాలము బ్రదుకనని యామె గ్రహించి తనచుట్టునున్నవారి పై మరింత దయారసమును గురిపింపసాగెను. ఆమెకు టాము అన్నచో ప్రాణము. టాముకు నామె యన్న గుండెకాయ. ఈవా టాప్సీసంగతిచూచి దుఃఖించి ఒకనా డాబాలికను పిలచి మీదచెయివేసి

బుజ్జగించి, "టాప్సీ! నీ వేల ఇట్లల్లరి చేయుదువు?" అని కన్నీరుతో ప్రశ్నించెను. ఇట్టి చల్లని మాట వినుటకు దయకు పాత్రురాలగుటకు టాప్సీ కిదియే ప్రథమపర్యాయము. టాప్సీ ఆశ్చర్యపడెను. కన్నీరు నించెను. "అమ్మా! నాకు ప్రపంచమున ఇది మంచి, ఇదిచెడ్డ,అని చెప్పినవారు లేరు. సహజముగ నేను దుర్మార్గురాలనని నాకు తోచుచున్నది. నేను నిజమాడినందుకు సంతసించినవారులేరు. తప్పు చేసిన మన్నించువారునులేరు. ఒఫీలియా అమ్మగారయినను నాకు నీళ్ళుపోసియు బుద్ధులుచెప్పియు సంరక్షించుచున్న మాట నిజమే కాని నన్నుస్పృశించుట కామె వెఱచును. నాపైన దయ ప్రేమ కలవారెవ్వరులేరు. ఇట్టి దురదృష్టవంతులజాతికిచెందిన నాకుసత్యము, సత్ప్రవర్తనము-ఎట్లలవడును?" అని పలికినది. ఈవా కన్నీరుబొటబొట కార్చెను. "టాప్సీ నీవిట్లుపలుకనేల? మనకెల్లరకు రక్షకుడగు నీశ్వరుడు నిన్నుజూచుటలేదా? సమస్తప్రాణుల పైన దయజూపు నాతనికి నీపైన ప్రేమలేదా?" అని మెల్లగ దీనముగ బలికెను. టాప్సీ తెల్లపోయెను. ఈశ్వరప్రేమయు, దయయు ఎట్లుండునో ఆమె కిదివరకు తెలియలేదు. ఈవా మరింతదీనముగ "టాప్సీ! నీపై నాకు ప్రేమకలదు. నా కానందము

కల్గించుటకైన నీవు బాగుపడుము" అనెను. టాప్సీ తన పెద్దకన్నులనుండి యశ్రువులు రాల్చెను. ఆమెహృదయము కరిగెను. ఒక్కమారుగ నామెకు ఆశాజ్యోతి, ఆత్మజ్ఞానవికాసము, కలిగెను. 'అమ్మా నేను బాగుపడుటకు ప్రియత్నింతు'నని వాగ్దానము చేసెను. ఈదృశ్యమును అగస్టైను చూచి ఒఫీలియాకుచూపించెను. ఒఫీలియా ఆశ్చర్య పడెను. "ఓహో! ఈశ్వరమాయ! ఆమెను ముట్టుకొనుట నాకు అసహ్యమను సంగతి ఆమె కెట్లు తెలిసెను? నిజముగ నీ నీగ్రోబాలిక కెంత బుద్ధిసూక్ష్మత వివేచనకలవు!" అనుకొనెను. ఈవా యొక్క కరుణ టాప్సీయం దత్యద్భుతమగు మార్పు కలిగించెను. వికటహాసము, వక్రివర్తనము, అసత్యములు తప్ప వేరెఱుగని పిల్ల, మెల్ల మెల్లగ వానిని మానెను. ఈవాకు జబ్బు హెచ్చెను. టాము ఆమెను కన్నబిడ్డవలె లేవనెత్తును. పంచపాళీక్రింద కుర్చీలో కూర్చుండబెట్టును. ఒఫీలియా ఆమెకనేక పరిచర్యల జేసెను. కాని లాభములేకుండెను. ఈవా మంచముపట్టెను. ఒఫీలియాతోపాటు టాము రాత్రింబవల్లు మేల్కొని ఈవాకు పరిచర్యలుచేయు చుండెను. ఒకనాడు టాప్సీ కొన్ని పువ్వులగుత్తులు

కట్టి ఈవాకొరకు తెచ్చెనుగాని ఈవాతల్లి యా
మెను గసరికొట్టెను. టాప్సీ గుడ్లనీరు గుక్కు
కొనెను. ఈవా ఇదిచూచి ఆమెను తనమంచము
దగ్గరకుబిలచి 'ఆహా! ఈ పూలగుత్తు లెంత బా
గున్నవే! అనుదిన మిట్టివానినే నీవు తెచ్చి నాపుష్ప
మంజూషయందు పెట్టుచుండుము' అనెను. ఈ మా
టలువిని టాప్సీ పరమానందముబొందెను. కొద్దిరోజు
లలో తాను ఈశ్వరసాన్నిధ్యముజేరుదునని ఈవా
గ్రహించి తన శిరోజముల గత్తిరించి తన తండ్రి
బానిసల నెల్లరను దగ్గరకు బిలిచి జ్ఞాపకార్థముగా
ఒక్కొక్కరి కొక్కొక పాయనిచ్చెను. వారు కన్నుల
నీరుగార్చుచు వానిని గ్రహించిరి. టాప్సీ మెల్లగ
భయపడుచువచ్చి 'అమ్మా నేను దుర్మార్గురాల
నని నాకు తెలియును కాని నాకు కూడ నొక పాయ
నియ్యవా ?' అని చేయి జాచెను. ఈవా కన్నీరు నిం
చుచు 'టాప్సీ!అవశ్య మిచ్చెదను. ఇదిగో తీసుకొమ్ము'
అని యిచ్చెను. ఈవా తాను మరణించినపిదప
టామును బానిసతనమునుండి విముక్తిచేయు మని
తండ్రికిచెప్పి చేతిలో చేయివేయించికొనెను. ఈవా
యొక్క దయార్ద్రహృదయము మరింత కరుణార్ద్ర
మయ్యెను. ఈ సుగుణమణి దివికేగునప్పుడు స్వర్గ
ద్వారములు బాగుగ దెరతురనియు తానీశ్వరదర్శ

నముచేసి తరింతుననియు టాము ఒఫీలియాతో పలి
కెను. "ఆహా! యీ నల్లవాని కెంత ఆత్మానాత్మ
వివేచనశక్తి కలదు!" అని ఒఫీలియా ఆశ్చర్యపడెను.
ఆ రాత్రియె ఈవా మరణించెను. ఇంటనున్నవారి
కెల్లరకు దుఃఖ మమితముగ నుండెను. ఆనాడు
టాప్సీ గుండె పగులునట్లు ఏడ్వసాగెను. 'అయ్యో
నామీద దయయు ప్రేమయుగల యీయొక్కయా
మెయు నన్ను వీడిపోయెను' అని కన్నీరుమున్నీరుగ
బడి యేడ్వసాగెను. ఈమె దుఃఖమునుచూచి ఒఫీలి
యాకు జాలికలిగి 'టాప్సీ! నీయందికముందు నేను
ప్రేమను కలిగియుండెద'నని ఎంతయో ఓదార్చెను.
ఆనాడు మొదలు టాప్సీ మరింత బుద్ధిమంతురా
లయ్యెను. అగస్టైను దుఃఖమునకు మేరలేదు.
టామాతని నూరడించుచుండును. ఒకరోజున ఒఫీ
లియా అగస్టైనుతో "ఎందుకైనమంచిది. టాప్సీని
నాకు దానముచేసి ఒకపత్రము వ్రాసియిమ్ము.
నేనామెకు విద్యచెప్పి వదలెద" నని కోరెను.
అగస్టైనట్లే వ్రాసియిచ్చెను. అగస్టైను టామును
బానిసతనమునుండి విముక్తిచేయుటకు వలసిన కార్య
క్రమమునకు పూనుకొనెనుగాని ఆవ్యవహారములోని

గుంటచిక్కులు తీరకముందె అగస్టైనుకు ఆకస్మిక మరణము తటస్థించెను. అతడు టాము నీశ్వరస్మరణము చేయుమనిగోరి అతని చేతులలోనె ప్రాణములువిడచెను. అగస్టైనుభార్య మేరీ యజమానురాలయ్యెను. ఆమె భర్తవంటిదికాదు. బానిసలయెడల నామెకుసానుభూతిలేదు. దయాదాక్షిణ్యములులేవు. అగస్టైనుటామునకు బానిసత్వ విమోచనము చేయదలచెననియు ఈవాకతడుచేసిన వాగ్దానముచెల్లింపుమనియు ఒఫీలియా మేరీకి చెప్పినను లాభము లేకపోయెను. తక్కిన బానిసలతోపాటు టామును వేలము వేయువారి అంగడికంపి క్రయధనము మేరీ మూటగట్టెను. వేలము వేయుచోటు నాగరకమగు పశువులసంతవంటిది. అచ్చట వేలము జరుగుముందర నీ బానిసలకు ముస్తాబుచేయుదురు. యజ్ఞ పశువులవలె మేపుదురు. వీరిని గొనవచ్చినవారు వీరిని పట్టి తడవి చూతురు. స్త్రీయొక్క అవయవములుగూడ తడవుచుందురు. అన్నిటికిని వీరు ఓర్చుకొనవలెను. వారియెదుట వీరు చలాకిగ సంతసముతో వర్తింపవలెను. అందకత్తెల కధికధనమువచ్చునుగనుక వారు ముస్తాబుచేసికొని ఒయ్యారముగ నుండవలయును. లేనిచో తిట్లు దెబ్బలు తప్పవు. టాముతోపాటు

విక్రయింపబడినవారిలో ఎమ్మెలైను అను చక్కని
చుక్క పదునై దేండ్ల యువతీమణియుండెను. ఆమెను
తల్లినుండి విడదీసి వేలము వేసిరి. ఈ తల్లి బిడ్డ లేమి
చేయగలరు? గుండె లవియున ట్లేడ్చిరి. దైవవశమున
టాము, ఎమ్మెలైనును, లూసీ అను నింకొక స్త్రీయు,
"లెగ్రీ" అను నొక కౄరుని పాలబడిరి. లెగ్రీ
మోటుమానిసి. కఠినహృదయుడు. అతడా బాలికను
తన కామముకొరకే కొనెను. టాము సహజముగ
శుభ్రమైన దుస్తులు ధరించియుండెను. బానిసలకు
శుభ్రమేమిటి? ఇన్ని బట్టలెందుకు! అని లెగ్రీ పలికి
ముందుగా వాని జేబువెదకి ఈవా నాడించుటకు
దాచియుంచిన ఆటవస్తువులను దీసి నదిలో పార
వైచెను. వాని బట్టలూడదీయించి ఒక చింకిచొక్కా
నొక చిరుగులలాగునిచ్చి "జాగ్రత్త; ఒకవత్సర మీ
జత వాడుకోవలె" ననెను. టాముపై బట్టలను అతని
పెట్టెలోని బట్టలనుగూడ ఓడలో వేలము వేసి
ఆసొమ్ము లెగ్రీ మూటకట్టుకొనెను. టామొక చిన్న
బైబిలును మాత్రము ప్రాణప్రదముగ దాచికొనెను.
'ఓరీ, టామూ! నీవేమో ఏసుక్రీస్తు మతము పుచ్చు
కొన్నట్లునాకు తెలిసినది. ఇక ముందు నేనే నీకు
దేవుడను. నామతమే నీవుస్వీకరింపవలె'నని హిరణ్య
కశిపునివలె లెగ్రీ హెచ్చరించెను. ప్రహ్లాదునివలెనే

టామ్ కూడ పరమేశ్వరునిస్మరించి యూరకొనెను.

వీరెల్లరు ప్రత్తితోటలమధ్యమున్న లెగ్రీ ఇల్లు జేరిరి. అచ్చట వీరిదుఃఖములు మొదలిడెను. లెగ్రీ కడుక్రూరుడు. అతనికి శాంబో క్వింబో లను ఇరువురు నమ్మిన నీగ్రోబానిసబంటు లుండిరి. తక్కిన బాని సలపై వారు కర్రపెత్తనము చేయుదురు. ఒకరిపై నొకరు కొండెములుచెప్పుటలో మొనగాండ్రు. బానిసతనము మానవునందుగల భూతదయను, సత్యమును, రూపుమాపి మానవుని పశువుగజేసి వైచును. ఎవ రే తప్పిదమొనర్చినను లెగ్రీ వీరిచే కఠినముగ చర్మపుకొరడాలతో మోదించును. లెగ్రీ తనబానిసలచే గొడ్లవలె పనిచేయించును. వారికి మందులిచ్చి సంరక్షించుట యనవసర మనియు హెచ్చుపనిచే జచ్చినచో నింకొకబానిసను కొను టయే చౌకపద్ధతి యనియు నెంచును. అందువలన వారికి శుభ్రమగు దుస్తులుగాని ఆహారముగాని వసతిగాని ఒసగడు. ఈ బానిసలు పగలెల్ల ప్రత్తి చేలలో పనిచేసి రాత్రి యిల్లుచేరి నాలుగు గింజలను విసిరికొని ఉడుక వేసి ఉడికి యుడకని జొన్నకూడు దిని గొలుకంపుకొట్టు గడ్డిపైననె బడియుందురు. టామ్ వీరిజీవనవిధానముజూచి కన్నీరు నించెను గాని ఏమిచేయగలడు? ఓర్చుకొనెను. లెగ్రీ తాను కొని

తెచ్చిన లూసీ అనుస్త్రీని శాంబోకిచ్చి తీసికొను మనెను. ఆమె "అయ్యో! నాకొకభర్త కలడ"నగా మారుమాటాడినచో డొక్క చీల్చెద ననెను.అయితే ఆమె శాంబోకి లొంగలేదు. టామయొక్క ఈశ్వర ధ్యానము సద్వర్తనము అచ్చటివారికి రుచింపలేదు. అజ్ఞానమువలన జనించు దుర్గుణములు దుర్వ్యసనము లెల్ల వారియందు పాదుకొనియుండెను. లెగ్రీ రాక్షసాంశ వారియందు మూర్తీభవించెను. శాంబో క్వింబోలు టామ్మపై చాడీలు చెప్పసాగిరి. లెగ్రీ ముందుగ టామ తలపై మోది 'ఓరీ నీవు నీ పద్ధతులు మార్చుకొనవలె'నని హెచ్చరించెను. టామ మారుమాటాడలేదు. మరునాడు పనిలోకిబోయెను. ఆనాడొకవింత జరిగెను. లెగ్రీయింట నిదివరకు బలవంతముగ నుంపుడుకత్తెగ చేయబడిన కాసీ అను నొక అందకత్తెయగు దానిననుకూడ లెగ్రీ పనిలోనికంపెను. ఎమ్మెలైను నామెస్థానమున నుంచవలెనని అతనియూహ. ఈమె పతనమునుచూచి దుఃఖించుటకుబదులుగా నీగ్రో లెల్లరు చంకలుగొట్టిరి. దాని పతన మెంతనైచ్యమగుఅనహానమును పెంచును!

కాసీ పూర్వము చాలసుందరి. ఆమె చిన్నతనమున గొప్పవారింట పెరిగెను. ఒక తెల్లవాడామెను పెండ్లాడెను. ఇరువురుపిల్లలు నొకబాలు డినొక

బాలికయు పుట్టిరి. అంతట నింకొక డీమెపైన గన్నువేసి ఈమెభర్తను దుర్వ్యసనములోనికిదింపి అప్పులపాల్జేసి ఈమెను చేజిక్కించుకొనెను. ఈమె కది రోతయేగాని నీ వంగీకరింపనిచో నీబిడ్డల నమ్మి వేసెదనని వాడు బెదిరించి యామెనులొంగదీసెను. ఆమెలొంగెను కాని బిడ్డలు విక్రయింపబడకుండ పోలేదు. ఈమెహృదయము పగిలినది. ఈమె కింకొక బాలుడుకలుగగా వాడు బ్రతికిన నింతేకదాయని వాని కీమె విషమిచ్చిచంపి ఈదుఃఖముతో అనారోగ్యమునబడెను. ఆమె సౌందర్యమును పోయెను. తరువాత నీమె ఈలెగ్రీయింట బానిసయయ్యెను. నాటినుండి యీమె యిచ్చట బాధ లందుచుండెను.

టాము కాసీ లూసీ లొకచోట ప్రత్తికాయలు కోసి విడదీయుచుండిరి. సాయంకాల మగునప్పటికి నియమితతూనిక ప్రత్తిలేయనిచో కొరడాదెబ్బలు తప్పవు. లూసీ చాల నీరసస్థితిలో మూల్గుటచూచి పాపము టాము తనబుట్టలోనిప్రత్తిదీసియామె బుట్టలోవేసెను. ఇది చూచి కాసీ 'అయ్యో! ఇచ్చటి సంగతి నీకు తెలియదు చాలచిక్కులు పడెద'వని తన ప్రత్తిని టాముబుట్టలో పడవైచి తా నతిత్వరితముగ ప్రత్తితీసెను. శాంబో ఇది చూచినాడు. టాముమోముపైన కొరడాతోకొట్టినాడు. లూసీని

తన్నినాడు. ఆమె పడిపోగా సూదితో గుచ్చినాడు లూసీబాధతో తుళ్లిపడి లేచెను, గాని పని చేయ లేకపోయెను. టాము మరల తనప్రత్తి నామె బుట్ట లో పడవైచెను. కాసీ తనప్రత్తిని టాముబుట్టలో పడవైచెను. కాసీ నేమనుటకును శాంబోకి ధైర్యము చాలకపోయెను. శాంబో వెళ్లి లెగ్రీతో నీ సంగతి చెప్పినాడు. 'ఓరీ, వీరి పొగరణచెదను. లెమ్మ్. నేనే స్వయముగా కాటా వేసెదను, టాముగాడిని లొంగదీయవలెనననెను. కాసీయొక్క అద్భుతశక్తి వలన కాటాదగ్గర ప్రత్తి అందరికి సరిగానేవచ్చెను గాని లెగ్రీ కనులెర్రజేసి లూసీప్రత్తి తగ్గిన దనెను. ఇక టామును శృంగభంగము చేయవలెను. "ఓరీ టామూ! ఈలూసీని కొరడాతో కొట్టు"మని లెగ్రీ యనెను. అంతట టాము "అయ్యా నేను మీబాని సను. మీరేపని చెప్పినను చేసెదను. నాకొడలు దాచుకొనను. కాని నన్నీ యన్యాయకార్యముచేయు మని నిర్బంధింపకుడు" అనెను. "ఓరీ నీ శరీరము నీ యాత్మనుగూడ నేను కొనివేయలేదటరా!" అనగా అతడు "స్వామీ! నాశరీరమును మీరు కొన్నమాట వాస్తవమే గాని నా ఆత్మనుమాత్రము మీరు కొనలేదు. కొనజాలరు. అది ఈశ్వరాయత్తము" అని నిర్భయముగా, మర్యాదగా, పలికెను. లెగ్రీ

గుఱ్ఱమెక్కజేసి, వీనిని చావబాదు డని శాంబో క్వింబోల కప్పగించెను. వా రితనిని పసరమును బాదినట్లు బాదిరి. ఒడలు రక్తపువరద లయ్యెను. ఆహారము నీరులేకుండగా నొక చీకటికొట్లో పడ వైచిరి. ఆరాత్రి టాము యమయాతన ననుభవించు చుండెను. 'దాహము దాహ'మని ఏడ్చినను విను వారులేరు, వానిపుండ్లు సలుపుచుండెను. వానిపైన దోమలు కీటకములు వ్రాలి బాధించు చుండెను. ఆరాత్రి కాసీ మెల్లగ లాంతరు తీసికొని వచ్చి వానికి కడుపునిండ చల్లని యుదకము ద్రావనిచ్చి ఆపుండ్లకు కొంతయుపశమనము కలిగించెను. టాము పరమేశ్వరుని కొనియాడి ఆమెకు వందనము లర్పించెను. 'ఓయీ, టామూ! ఈక్రూరునిసంగతి నీ వెఱుగవు. నిన్ను చిత్రవధ చేయించును. నీ పట్టుదల విడువుము' అని యామె పలికెను. 'అమ్మా! నా ప్రాణము పోయినను నన్యాయమున కొడిగట్ట'నని అత డనెను. కాసీ వాని కుపచరించి తనకథనుచెప్పి ఎమ్మెలైనును వశముచేసుకొనుటకు లెగ్రీ చేయుచున్న ప్రయత్నము లితనికి చెప్పెను. టాము "అమ్మా! నన్ను వదలుము. చేతనైనచో నీవును ఎమ్మెలైనను కలిసి పారిపోవుడు" అని చెప్పెను. ఆమె "ఓయీ, అది చాలాకష్టము. లెగ్రీయొక్క వేటకుక్కలు

పెద్దపులులవలె వెన్నంటి చీల్చివేయు”ననును-
టా మీాశ్వరధ్యానము చేయసాగెను. కాసీపోయి
లెగ్రితో “ఓయీా పనివానిని గొట్టి ఈ పనిదినము
లలో పనివానిని నిరుపయోగముగా చేసి కొంటివే!
పనివారులేనిచో తక్కిన వర్తకులతోపాటు నీవు
ప్రత్తిని బజారులో పెట్టగలవా!” అని వాని ధన
తృష్ణను హెచ్చరింపగ వాని కోపము కొంతతగ్గెను.
కొన్నిదినములైన పిదప కాసీ లెగ్రి త్రాగుసారా
యములో మత్తుమందు కలిపి “ఓయీా, టామూ!
ఈ కూ్రరుడు మయికముతో పడియున్నాడు. వానిని
వధింపు”మనగా,టాము“అమ్మా! నేనట్టిపని నెన్నడు
చేయజాల”నని యామె పాపపుతలంపును వారించెను.
దీనితో కాసీ చిత్తచాంచల్యము కొంత తగ్గెను.
ఆమె ఎమ్మెలెనును రక్షించు నుపాయము పన్నెను.
లెగ్రి ఇల్లు చాలాపురాతన మైనది. ఒక మూల
గదిలో దయ్యమున్నదనివాడుక. ఎవ్వరు నక్కడకు
పోవరు. లెగ్రి ఒకమాా రొకని నాగదిలో వడవేసి
చంపియుండెను. కాసీ అంతటనాగదితలుపు కంతలో
నొక పగిలినసీసామెడ పెట్టెను. గాలివచ్చినప్పు
డా సీసామెడనుండి వింతధ్వని లెగయ సాగెను.
ఎలుకల చప్పుళ్లు నీధ్వనులునుచూపించి దయ్యములు
విజృంభించుచున్న వనియు తానా గదిదగ్గర వండు

కొనజాల ననియు కాసీ తనపడక నింకొక చోటికి
మార్చెను. లెగ్రీ మోటువాడేగాని చాలా పిరికి
పంద. అది మొదల తడధికముగా త్రాగ మొద
లిడెను. ఆగదినిచూచి భయపడసాగెను. కాసీ
కొంత ఆహారము బట్టలు నాదయ్యాపు గదిలోనికి
ముందుగ జేర్చియుంచెను. ఒకనాటి సాయంత్రము
కాసీ ఎమ్మెలైనను వెంటనిడికొని ఆయింటి దగ్గర
నున్నఊబినిదాటి పోవుటకు ప్రయత్నించుచున్నట్లు
నటించెను. అంతట లెగ్రీ వీరికదాటి పోలేరుగదా
యనివారిని తరిమి పట్టుకొనుటకు బానిసలను కుక్క
లను తీసికొనివచ్చుటకు ఇంటికివచ్చెను. ఈలోపున
కాసీ ఎమ్మెలైనులు రహస్యముగ తిరిగివచ్చిదయ్యాపు
గదిలో చేరిరి. ఆరాత్రి లెగ్రీయు, బానిసలును,
నిరుగుపొరుగు పాలికాపుబానిసలును, నీగ్రోరక్త
మును చవిచూచియున్న కుక్కలును, ఆ ఊబి ప్రదేశ
మెల్ల వేటాడి చూచిరి. ఈదుర్మార్గులు కనబడియు
దొరకనిచో వారిని తుపాకితో కాల్చివేయుడని
లెగ్రీ తన అనుచరులను ఆజ్ఞాపించివైచెను.

తమ తోడిబానిసలలో నొకరు తప్పించుకొని
పోవుచున్నారని సంతసించి వారు సురక్షితముగా
బయటపడుదురుగాక యని కోరుటకు బదులు,
వారిని వేటాడి పట్టుకొన దలచు క్రూరుడగు యజమా

నికే ఈబానిసలుసాయముచేసి మేహార్బానీపొంద
నుత్సహించుచుండిరి. ఇదిబానిసబుద్ధియొక్క పరిణామ
మేకదా! "పట్టుకున్నవానికిబహుమానము, బాగుగా
పరుగెత్తినవానికి సారా-" అని యజమాని హెచ్చ
రించెను. వీరెల్లరు వెదకి వెదకి, విసిగి వేసరి, ఇంటికి
వచ్చిరి. టాము కీపలాయనము సంగతి తెలియు
నని లెగ్రి యనుమానము జెంది వానికడకు పోయి
"ఒకే, టామూ! నీవు నిజము చెప్పెదవా లేక నీ చర్మ
మొలిపించమనెదవా!" అని అదలించెను. "స్వామీ
నాకు నిజము తెలియునుగాని నేను చెప్పను. నన్ను
చంపిన జంపుము. దీనివలన నా ఈప్సిత మీడేరును.
మీకు మాత్రమిది శ్రేయస్కరముకాదు" అని
టాము పలికెను. లెగ్రి మండిపడి పండ్లు పటపట
గొరికి శాంబోక్వింబోలకు కనుసన్న జేసెను. ఈ
యమదూతలు కొరడాలతో టామును మోద
సాగిరి. దెబ్బదెబ్బకు నీశ్వర స్మరణముతప్ప వాని
నోట పరుషభాషణముగాని 'పలాయితులసంగతి
చెప్పెదను కొట్టకు' డను పలుకులుగాని వెలువడ
వయ్యెను. వానియొడలు రక్తపువరద లయ్యెను.
అతడు స్మృతితప్పి పడిపోయెను. వీనికి మరణ
మాసన్నమైనదని వారు గ్రహించి వీనినొక మూల
కీడ్చిపడవైచిరి. అంతట లెగ్రీబానిసలలోకొందరి

హృదయములు కరిగెను. "అయ్యో, పిడెల్లప్పుడు నీశ్వరధ్యానము చేయుచుండెనే! ఎంతపాప'మనిరి. శాంబోక్లోంబోలకుగూడ మనసు కొంచెము కలత జెందెను. టాము నోట నురగలు వచ్చుచుండెను. అతడు గొడ్డుమూలిగినట్లు మూల్గుచు పడియుం డెను. కాసీ కీసంగతి యెట్లో తెలిసినది. తానుబయ ల్పడుదు నను భయమైనలేక యారాత్రి యామెవచ్చి టామునకు కొంతపరిచర్యచేసెను. టాము కొంచెము తెప్పిరిల్లెను. అతని భౌతికదేహ మమితబాధనందు చుండెనేగాని అతని త్యాగశక్తిచేత ఆత్మమాత్రము శాంతిజెంది ఆనందమున నోలలాడుచుండెను.

సెంటుక్లేరు నింటనున్నప్పుడే టాము షెల్బీ గారియింటనున్న తనభార్య కొకజాబును వ్రాసి యుండెను. తనప్రతియజమానునివ్యవహారములుచక్క బడినచో నతడు తనను మఱలగొని తీసికొని పోవు నని యతనియాశ. సెంటుక్లేరు మరణించిన పిదప ఒఫీ లియా ఇంకొక లేఖను షెల్బీగారికి వ్రాసెనుగాని అది యందుట చాల నాలస్యమయ్యెను. అప్పటికి షెల్బీగారు మరణించిరి. షెల్బీ భార్యయు పుత్రు డును, తమవ్యవహారములు జక్కబెట్టుకొని టామును గూర్చి యోజింప సాగిరి. షెల్బీగారి కొమరుడు జార్జిషెల్బీ టాముకొరకు వెదకుచు బయలుదేరెను.

సెంటు క్లేరు ఆ స్త్రీని విక్రయించిన లాయర్ల నితడు ప్రశ్నింపగా వా రితని జాడలను చెప్పలేకపోయిరి. ఎట్టకేలకు టాము లెగ్రీ యింట నున్నట్లు జార్జికి తెలిసెను. అంతట నతడు చాల కష్టపడి తుదకు లెగ్రీ యింటికి వచ్చునప్పటికి టాము పైన చెప్పిన యవస్థలో నుండెను. జార్జి చాలా దుఃఖించి టాము పడియున్న కళ్ళెల భూయిష్టమగు చోటికి పోయి "టామూ! నేను జార్జిషెల్బీని. ఒక మారు కనువిప్పి నావంక చూడు" మని గద్గదస్వరముతో పలికెను. టాము దేహము పులకితమయ్యెను. విద్యుత్కాంతి ప్రవహించినట్లత డదరిపడెను. కంటియందు విద్యుల్లత మెరసినట్లయ్యెను. కన్నువిప్పెను. ఇదికలయా! అను కొని దిగ్భ్రమ జెందెను. జార్జి టాము నాలింగనము జేసికొనెను. అంతట 'ఆహా! నాచిన్న యజమానుడు వచ్చినాడు. నాకోర్కె తీరిపోయినది.' అని టాము గొణుకుకొనుచు ఆనంద బాష్పముల రాల్చెను. జార్జి "టామూ! నిన్ను విడిపించుకొని పోవుటకు వచ్చితిని" అని జార్జిపలుకగా టాము హీనస్వరముతో "నాయనా! నేను బానిసతనము లేని దివ్యలోకమునకు బోవుచున్నాను. నాకింక నెట్టికోరికలును లేవు. నా మరణకారణములు మాత్రము నా ముదుసలి యిల్లాలికి చెప్పకు. పాపము దానిగుండెలు పగులును" అని

పలికి ఈశ్వరస్మరణముచేయుచు ప్రాణములు విడి
చెను. జార్జిషెల్బి యాడుదానివలె రోదనముచేయ
సాగెను. చుట్టుచేరిన నీగ్రోలు కంట తడిపెట్టిరి
జార్జి తన పెద్ద కోటునుదీసి టాముపైనగప్పి
యచ్చటినుండిలేచి లెగ్రీకడకుపోయి "ఓయీ టాము
శరీరమును నా కెంత కమ్మెదవు ?" అని యడిగెను.
లెగ్రీ ఏకళనుండెనోగాని చుట్టగాల్చుచు "నేను
చచ్చినబానిసల నమ్మను. కావలసినచో వానికళే
బరమును నీవు తీసికొనిపోవచ్చును." అనెను. జార్జికి
కోపావేశము కలిగెను. "ఓయీ, లెగ్రీ! నీవీ నరహత్య
జేసినందులకు నీపై నేను కేసుపెట్టదలచితిని" అని
పండ్లు పటపటకొరుకుచు పలికెను. అంతట లెగ్రీ
పండ్లిగిలించుచువికటహాసముజేసి "ఓయీ, నీయిష్టము
వచ్చినట్లు చేసుకొనవచ్చును నాకెట్టిభయమునులేదు.
నాకెవరు సాక్ష్యమునిచ్చెదరో చూచెదను!" అనెను. జార్జి
కోపము పట్టలేక లెగ్రీపైనబడి ఒక గుద్దుగుద్దెను.
లెగ్రీ నిశ్చేష్టుడయ్యెను. ఏమనలేదు. జార్జియంతట
టాము శరీరమును లేవనెత్తి తన బండిలో నిడికొని
పోయి పచ్చనిపచ్చికపెరిగిన బయలులో నొక
చోట తానేపూడ్చి అచ్చట మోకాళ్లపైన సాగిల
బడి "ఓపరమేశ్వరా! ఈటాము బానిసత్వము యొక్క
ఘోరాన్యాయముల కాహుతియైనాడు. ఇక నా

జీవిత ముండగా నీచానిసతనమును నేను సహింపక
నని శపథముచేసి తనదారిని పోయెను.

అట కాసీ ఎమ్మెలెనును వెంటనిడికొని మారువేష
ములతో మెల్లగ లెగ్రీ యిల్లు వెడలివచ్చి జార్జి షెల్బీ
యెక్కిన స్టీమరులోనే యెక్కెను. వీరిరీతిజూచి జార్జి
వీ రసాహాయ్యస్థితియందున్నారని గ్రహించి వీరికి
సాహాయ్యము చేయసాగెను. ఆయోడలోనే ఇంకొక
సుందరీమణి ప్రయాణముచేయుచుండెను. మాటల
సందర్భమున తనసోదరుడు జార్జిహారిసును తానును
తమచిన్నతనముననే బానిసలుగ విక్రయింపబడితి
మనియు, తన యదృష్టవశమున తననుగొన్నవాడు
మంచివాడనియు, తనను పరిణయమాడి తనకు స్వా
తంత్ర్యమును ధనమునొసగి చనిపోయె ననియు
చెప్పగాజార్జి, హారిసుసంగతి యంతయు నామెకుజెప్పి
ఎలిజాసంగతికూడ చెప్పెను. ఈ మాటలనువినిన
కాసీ ఎలిజాయే తన కొమారిత యనిగ్రహించి
కన్నీరుగార్చెను. అంతట వీరందరు హారిసు ఎలి
జాల నన్వేషింపబోయిరి. హారిసు ఎలిజాలు కెన
డాలో నొకచోట సుఖముగా గాపురముండిరి.
వారికి చేతినిండ ధనములేకున్నను వారిప్రేమయే
ధనముగా జీవించుచుండిరి. హారీగాక వారి కిరువురు
పిల్లలుగలిగిరి. ఈ కుటుంబమును జూచి అందరు

ముచ్చటపడుచుందురు. కాసియు ఎమ్మిలైనును హారిసుసోదరియుజార్జియు వీరున్న చోటికిజేరగా ఒకరి నొకరుకౌగిలించికొనిసంతోషించిరి. అంతట హారిసు సోదరి తనధనమెల్ల హారిసున కిచ్చెను. ఈధనముతో హారిసు అమెరికాలోని తెల్లదొరలవలె గొప్పవాడై సుఖముగా జీవించియుండవచ్చునుగాని అతని కిట్లు తోచినది." నేనెంత తెల్లగానున్న నేమి? నాయందు నీగ్రోజాతిరక్తము ప్రవహించుచున్నది. ఈ తెల్లవా రెల్లప్పుడు నాజాతి నంటరానివారిగాజూచి బాధించి యవమానించుచునే యుందురు. నాజాతియభివృద్ధికి నేనుతోడ్పడి వారికేదైన సేవచేసి తరింపవలెనుగాని ఈ తెల్లవారితో కలిసి జీవించినచో నా కేమి పురుషార్థము?" అని నిశ్చయించుకొని నీగ్రోజాతియొక్క జన్మభూమియగు ఆఫ్రికాదేశమునకు తరలిపోయి అచ్చట నాజాతి నుద్ధరించుటకు తన యావచ్ఛక్తిని వినియోగింపసాగెను.

---

BY THE SAME AUTHOR:

# Co-operative Store Movement

## సహకార వస్తు నిలయోద్యమము

Approved by the Text Book Committee Madras, for use in Libraries. Vide Fort St. George Gazette 16-4-35 Page 256.

*260 Pages.* *Price One rupee.*

This is a comparative study in practical economics and statistics. The many sided activities and achievements of co-operation in the nation-building activities of the west and its immense possibilities in solving the problems of poverty and ignorance of the Indian peasant and worker, the reorganization of the economic resources of the country and its industrial development and above all in the building up of a Co-operative Democracy in India, are discussed from a practical point of view. It contains the history of Rochdale Pioneers, the story of industrial and agricultural co-operative enterprise in England, Germany and other countries and the lessons they offer us. The appendices of comparative statistics covering over 68 pages are invaluable to students of Indian Economics and World Politics.

" A standard work on co-operative movement "—Bharathi.

---

# DOMINION STATUS

## అధినివేశ స్వరాజ్యము.

*250 Pages.* *36 Statistical tables.* *Price As. 12.*

**OPINION OF THE HINDU 19-11-1933.**

"It is a comprehensive study of the subject. The authors have traced intelligibly and briefly the evolution of Dominion Status right up to the Statute of Westminister.

In a brilliant chapter the authors have endeavoured to refute the several arguments that have been advanced to prove India's unworthiness for full Dominion Status in the immediate future.

It is not merely a satisfactory treatise on Dominion status with particular reference to India. It is also a very useful introductory volume to a study of the British and Dominion constitutions. The authors have attempted at various places in the book to explain in simple terms such as could be understood by any one least acquainted with political terminology, concepts such as Sovereignty, Federation, Proportional Representation etc. The book is a valuable contribution to the meagre literature in Telugu on Dominion Status or comparative politics."

---

ఇంగ్లీషు - తెలుగు

# పారిభాషిక నిఘంటువు

## వ్యవహారకోశము, శాస్త్రపరిభాష

కలిపిన సంపుటము

రచయిత: దిగవల్లి వేంకటశివరావు, బి. ఏ., బి. యల్.

[గ్రంథాలయములం దుంచుటకు మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవా రామోదించియున్నారు. ఫోర్టుసెంట్ జార్జి గెజెట్ 16-4-35 పుట 258]

'వ్యవహారకోశము' రాజకీయ, ఆర్థిక, న్యాయశాస్త్రాది విషయములను గూర్చిన ఇంగ్లీషు - తెలుగు విజ్ఞానకోశము. ఇది ప్రపంచరాజ్యాంగములు, రాజకీయార్థిక సిద్ధాంతములు, వ్యవహారములు, నాణెము, చలామణి, వ్యాపారము, సహకారము మున్నగు వ్యవహారములను గూర్చిన విజ్ఞాన సర్వస్వ సంగ్రహము. పైవిషయములనుగూర్చిన ఇంగ్లీషు పారిభాషిక పదములకు తెలుగున పర్యాయపదములును, అర్థములును, విపులములైన వ్యాసము లనదగిన వ్యాఖ్యానములును ఇందు గలవు. నేడు ప్రపంచరాజకీయార్థిక వ్యవహారములందు ప్రాముఖ్యము వహించిన కాపిటలిజం, సోషలిజం, కమ్యూనిజం, ఫాసిజం మున్నగు నూతనసిద్ధాంతములును, పార్లమెంటు పరిపాలన అధ్యక్షపరిపాలన, ఏకైక, (సంయుక్త) ఫెడరలు రాజ్యాంగములును, ఇంగ్లాండు, అమెరికా, స్విట్జర్లాండు, సోవియటు రష్యా, ఇటలీ, రాజ్యాంగములను గూర్చియు, రిజర్వుబ్యాంకి, ఫెడరలురిజర్వుపద్ధతినిగూర్చియు, ఒకటి రెండు పుటలకు తక్కువగాని వ్యాసములలో చర్చింపబడినవి. ప్రపంచ రాజ్యములు, విస్తీర్ణములు, జనసంఖ్య, ముఖ్యపట్టణముల పేర్లు, విలువమున్నగు వివరములుగల పట్టిక చేర్చబడినది. వ్యవహారసంబంధములైన తెలుగున వాడుకలోనున్న కొన్నివందల హిందూస్థానీపదములు, అర్థములు చేర్చబడినవి.

'శాస్త్రపరిభాష'లో గణితము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, జీవశాస్త్రము, వృక్షశాస్త్రము, శరీరశాస్త్రము, జంతుశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, ధాతుశాస్త్రము, భూగోళశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము,

శరీరవ్యవచ్ఛేదశాస్త్రము, వైద్యశాస్త్రము, తర్కము, వేదాంతము మున్నగు శాస్త్రవిజ్ఞానమునకు సంబంధించిన ఇంగ్లీషు సాంకేతిక పదములకు తెనుగున ఇదివరకు విజ్ఞానచంద్రికాగ్రంథమాలలోని శాస్త్రగ్రంథములందును, విజ్ఞానసర్వస్వమునందును, ప్రభుత్వమువారు ప్రకటించిన పర్యాయపదముల పట్టికలందును, ఇతర శాస్త్రగ్రంథములందును వాడబడిన పదములును, అవి లేనిచోట్ల, హిందీమహారాష్ట్ర గీర్వాణవిద్వాంసులచే పరిష్కరింపబడి చిరకాలము క్రిందటనే స్థిరరూపము దాల్చి యావద్భారతదేశమున ప్రసిద్ధిజెందిన హిందీవైజ్ఞానిక శబ్దావళియందును ట్వంటియత్ సెంచరీ ఇంగ్లీషు మహారాష్ట్రసాహిత్య సాంకేతిక వైజ్ఞానిక నిఘంటువునందును సమకూర్చబడిన పారిభాషిక పదములలో మన కుపయోగింపగల పదములను, అకారాదిగా నిందు ముద్రింపబడినవి. ఇంగ్లీషు తులామానములకు సరియగు తెనుగు తులామానములను తెలుపు పట్టికలు చేర్చబడినవి.

ఇటీవల ప్రకటింపబడిన 'భారతదేశ ఆర్థికచరిత్ర' 'ఆంధ్రవాచస్పత్యము' మున్నగు పెక్కు గ్రంథములలోని పారిభాషిక పదముల కీ నిఘంటువే ప్రమాణముగా పేర్కొనబడియున్నది. ఇది అనేక పత్రికలయొక్కయు విద్యాధికులయొక్కయు మన్ననలందినది. శాస్త్రవిషయములను తెనుగున బోధించు పెక్కు ఉన్నతపాఠశాలలందును తెనుగుతర్జుమాల యవసరముగల అనేక కోర్టులందును ప్రభుత్వకార్యాలయములందు నిది యుపయోగింపబడుచున్నది.

జడ్జీలు, మేజిస్ట్రేటులు, ప్రభుత్వ శాఖలయొక్క అధికారులు, ఉద్యోగులు, విద్యాధికులు, విద్యార్థులు, బ్యాంకర్లు, భీమాయేజంట్లు, సహకారవ్యాపారసంఘములవారు, వైద్యులు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు పత్రకర్తలు మున్నగువా రనేకులు దీని నుపయోగించుచున్నారు.

రెండుభాగములలో కలిసి పదివేల సాంకేతిక పదములకు పర్యాయపదములు కలవు. క్రౌనుసైజున 530 పుటలు. చిన్నఅచ్చు. చక్కని బైండు. వెల తపాలాచార్జిగాక రు 2—8—0 లు.

శాస్త్రపరిభాష విడిగా తపాలాచార్జిగాక రు 1—4—0

# పారిభాషిక నిఘంటువునుగూర్చిన అభిప్రాయములు:

కృష్ణాపత్రిక 2-2-1935.

"ఇత్యాది ఇంగ్లీషు తెలుగు వ్యవహారకోశము, శాస్త్రపరిభాష, కలిసిన సంపుటము. నేడు ప్రపంచ విజ్ఞానము అపూర్వముగ నభివృద్ధిగాంచుచున్నది. వెనుకబడియున్న దేశభాషలు కూడ నేడు అపూర్వమైన మార్పుల నొందుచున్నవి. క్రొత్త పదము లెన్నియో తెలుగులో చేరుచున్నవి. పాత వానికి క్రొత్త యర్థములు కల్పింపబడుచున్నవి. ఒకే భావమునకు పలువురు పలువిధములగు పదముల నుపయోగించుచున్నారు. ప్రకృతి శాస్త్రపరిశోధనలకు రాజకీయార్థిక శాస్త్రములకు సంబంధించిన సాంకేతిక పదములకు దగిన పర్యాయపదములు లేక తెలుగులో, నూతన విజ్ఞానము వ్యాపించుట కవకాశము లేకున్నది. ఎల్లరకు సులభముగ గ్రాహ్యములగునట్లు కొన్ని పదములను రూఢము చేసి, చలామణిలోనుంచగలిగిన బాధ్యత సాహిత్య పరిషత్తులకు గలదు. కాని యీ బాధ్యతను ఆంధ్రసాహిత్యపరిషత్తు ఇంతవరకును గొనసాగించలేదు. వారు తలపెట్టిన సూర్యరాయాంధ్రనిఘంటువు ఏ కాలమునకు పూర్తియగునో తెలియదు. అందువలన ప్రస్తుతకాలమునకు సంబంధించిన వ్యావహారికపదముల నింతవరకు స్వీకరించుటకు బూనుకొనినదెవరో చెప్పుటకు వీలులేకున్నది. వ్యవహారకోశ మొకటి యావశ్యకము, ప్రచురించుటకు తరుణ మాసన్నమైనది. ఈ విషయములో గాఢపరిశ్రమ చేసినవారందరును, భాష చాలదిక్కులలోనుండి తాకిడులకు లోనగుచున్నదని గ్రహింతురు. శ్రీ గిరావుగారు ఈ కార్యమునకు బూనుకొనుట యెంతయు ప్రశంసార్హము. వారు ప్రచురించిన వ్యవహారకోశము విద్యార్థులకు, పత్రికాధిపతులు, లేఖకులు, గ్రంథసంపాదకులు మొదలగు వారికెల్ల చాల యుపయోగముగ నుండగలదు. ఈ గ్రంథము నిర్దుష్టమని చెప్పము. ఇందు కూర్చబడిన పదములన్నియు బ్రమాణములుగ నంగీకరింపబడక పోవచ్చును. కాని ఈ విషయములో వీరు దారితీసిన సాహసము. వీరు చూపిన శ్రమ అత్యద్భుతము. వీరి ప్రయత్నము సర్వవిధముల ప్రోత్సహింప దగినది."

గృహలక్ష్మి, మార్చి 1935.

“కోర్టులు, రాజకీయములు, శాస్త్రవిషయములకు సంబంధించిన అనేకపదములకు అర్థములు వ్రాయబడినవి. వ్యవహారజ్ఞులకు, దేశసేవకులకు, విద్యార్థులకు, వ్యాసరచయితలకు, దీనివలన కలుగు ప్రయోజనము లనంతములు. ఆంధ్రభాషకిది అమూల్యభూషణము. విద్యాధికులనేకుల ప్రశస్తు లందినది. పాశ్చాత్యగ్రంథనిర్ణయసభవారిచే గ్రంథాలయోపయోగనిమిత్త మంగీకరింపబడినది.”

---

శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు:

“శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారు కూడా మీ పుస్తకాన్ని చాలా ప్రశంసించినారు. పుస్తకాన్ని చూచి నేనుకూడా దానికి తృప్తి కలిగినాను.”

---

సర్. అల్లాడి కృష్ణస్వామయ్యర్‌గారు, అడ్వొకేట్ జనరల్:

“ఈ రకపు నిఘంటువులలో నిది మొదటిది. చిరకాలమునుండి యున్న కొరత నిది తీర్చుచున్నది. దేశభాషలలో విద్యగఱపుటలోను ఇంగ్లీషుగ్రంథములను తెనిగించుటలోను ఇది యుపయోగించుననుటకు సందియము లేదు.”

---

శ్రీ నిష్ఠల బలరామమూర్తి పంతులుగారు, ఏజెన్సీ సబ్‌జడ్జి:

“విపులార్థనిర్వచన సమన్వితమై, సుశోభనమునై అత్యంతోపయుక్తమగు విజ్ఞానకోశము.”

సర్. వేపా రామేశంపంతులుగారు:

“ఇంగ్లీషు తెనుగుపారిభాషికనిఘంటువు అత్యంతోపయుక్తమగు ప్రయత్నము. అన్యభాషాపదముల నుపయోగింపకయే తెలుగున శాస్త్రగ్రంథములు వ్రాయుట కిది తోడ్పడును.

ప్రజామిత్ర, 20-2-35.

"ఈ విధముగా భాషాసేవ చేయుచున్నందుల కాంధ్రులు వారి కెంతయో ఋణపడుచున్నా రనుటలో సందియము లేదు."

---

కృష్ణాపత్రిక 21-8-35.

"శివరావుగారి ఆంధ్రభాషాసేవాప్రయత్నఫలితమే యీ పరిభాషా నిఘంటువు ... చేతికలము పోగక దిగ్భ్రమ చెందియున్న యిప్పటి ప్రాంతీయుల కాంధ్ర నిఘంటు వెంతయు సహాయము కాగలదనుట నిక్కువము."

---

'హిందూ' (19-6-34):

"ఇంగ్లీషు తెనుగుపదమాల యవసరముగల ప్రభుత్వశాఖలందలి అన్ని కార్యాలయములందును, ఇతర సంస్థలందును ఇది అత్యంతావశ్యకమగు ననుటకు సందియము లేదు."

---

శ్రీ వేపా పూర్ణయ్య పంతులుగారు (రిటైర్డుజిల్లాజడ్జి.):

"పర్యాయపదము లెంతో యుక్తియుక్తముగా నున్నవి."

---

శ్రీ ధన్వాడ అనంతంగారు, (సుప్రసిద్ధవిద్యాధురీణులు ):

"శాస్త్రప్రవీణులపరిషత్తువారు కృషిచేయగలందులకు ఆధారము కల్పించినందుల కాంధ్రదేశములోని విద్యార్థు లందరియొక్క అభినందనములకును ఈ గ్రంథకర్త అర్హుడు."

---

"మన గ్రంథకర్తగారు ఆంధ్రదేశమునకు శ్లాఘ్యమగు నుపకారము చేసియున్నారు. వ్యవహారపరులే కాక కేవలము భాషాభిమానులును దీనివలన గొప్పప్రయోజనములు పొందగలరు."—భారతి-భావ సం|| ఆషాడము.
July 1934

---

"పరిశోధకులకు, గ్రంథకర్తలకు నత్యంత ప్రయుక్తముగ నుండగల సాంకేతికశాస్త్రపారిభాషికపదము లిందు చాలగలవు."

కొత్తూరు రామారావుపంతులుగారు ఎం. ఏ. ఎల్. టి.,
హిందూహైస్కూలు, బెజవాడ.

శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు హైదరాబాదు.

"ఈ పుస్తకములు మన మాతృభాషకు అమూల్యాలంకారము అని చెప్పవొప్పును."

ఈ నిఘంటువు నాదరించిన ప్రముఖులు, సంస్థలు.

సర్ శేషా రామేశంగారు, హైకోర్టుజడ్జి.
సర్ అల్లాడి కృష్ణస్వామిగారు, అడ్వొకేటుజనరల్.
సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు, లా మెంబరు.
శ్రీ దురుశేటి అప్పారావుగారు, హైకోర్టుమాష్టరు.
శ్రీ విక్రమదేవవర్మగారు, జయపురంమహారాజాగారు.
ఇంగ్లీషు-కన్నడ డిక్షనరీఆఫీసు మైసూరుగవర్నమెంటు.
అన్నామలై విశ్వవిద్యాలయలైబ్రరీ.
బెనారసు హిందూవిశ్వవిద్యాలయలైబ్రరీ.
మదనపల్లి కాలేజిప్రిన్సిపాలు.
తేకుమళ్ల రాజగోపాలరావుపంతులుగారు బి. ఏ. ఎల్. టి.
మైసూరు మహారాజాగారి సంస్కృతకళాశాల ప్రిన్సిపాలు
జె. కే. లంకాస్టర్‌గారు, I. C. S. బెల్లారిజిల్లా జడ్జి.
ఆర్ వెంబుఅయ్యర్ గారు బి.ఏ., బి.యల్., సబుజడ్జి చెంగల్పట్టు
జె. ఆర్. కృష్ణయ్య చెట్టిగారు బి. ఏ., బి. యల్., మున్సబు
శేషా పూర్ణయ్యపంతులుగారు బి. యల్., రిటైర్డుజిల్లాజడ్జి.
మహబూబ్‌ఖాన్ గారు డిప్యూటీకలెక్టరు.
బి. నాగప్పగారు ఎం ఏ., మేజస్ట్రేటు. హార్పనహల్లి
దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు.
శ్రీ వేంకటగిరిమహారాజాగారు.
ఓరియంటల్ ఇన్సూరెన్సుకంపెని సెక్రెటరీగారు విశాఖపట్నం.
కో-ఆపరేటివు డిప్యూటీరిజిస్ట్రారు బెజవాడ.
బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు.
,, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు.
,, వావిలికొలను సుబ్బారావుపంతులుగారు.
,, పింగళి లక్ష్మీకాంతంగారు, ఆంధ్రవిశ్వవిద్యాలయం.

టి. వెంకటరామయ్యగారు, రంగూను హైకోర్టు అనువాదకుడు.
సోమంచి సీతారామయ్యగారు అసిస్టెంటు లెక్చరరు ఏలూరు.
కెడింబి హనుమంతరావుగారు పబ్లిక్ ప్రాసిక్యూటరు
యం. రామచంద్రశాస్త్రిగారు, పోలీసు ఇనస్పెక్టరు.
డాక్టరు భట్యాడ రామచంద్రరావుగారు ఎం. ఏ. ఎల్. టి.

టెయిలరు హైస్కూలు నరసాపురం, వార్డులా హైస్కూలు బళ్లారి, వీరేశలింగం హైస్కూలు రాజమండ్రి, మున్నగు హైస్కూళ్ల హెడ్మాస్టర్లు, ఇంకను అనేకమంది విద్యార్థులు, కాలేజి అధికారులు, మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, సహకారసంఘములు, డాక్టర్లు, మునసబులు, సబుజడ్జీలు, ఉద్యోగులు, ఆడిటర్లు, వర్తకులు మున్నగువారు.

---

# సహకారవస్తునిలయోద్యమము

## భారతదేశస్థితిగతులు.

కృష్ణాజిల్లా కో-ఆపరేటివు ఫెడరేషనువారిచే ప్రకటితము.

గ్రంథకర్త:

దిగవల్లి వేంకటశివరావు, బి. ఏ., బి. యల్.,

బెజవాడ ఆంధ్ర కో-ఆపరేటివు ఇన్స్టిట్యూటు గౌరవ డైరెక్టరు.

మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారిచే గ్రంథాలయోపయోగమునకు

నిమిత్తము ఆమోదింపబడినది.

(ఫోర్టుసెంట్ జార్జి గెజెట్ 16-4-35 పుట 256)

పాశ్చాత్యదేశములందు సహకారోద్యమము ఎన్నెన్నిరూపములు దాల్చి ఆదేశప్రజలవిద్యాభివృద్ధికి, ఆరోగ్యమునకు, యోగక్షేమములకు, ఆర్థికాభివృద్ధికి, ఔన్నత్యమునకు సర్వతోముఖముగ జాతీయతకు తోడ్పడుచున్నదో అది భారతదేశదారిద్ర్యమును బాపి కార్మికులయొక్కయు కర్షకులయొక్కయు దుస్థితిని తొలగించి వారికి విద్య, ఆరోగ్యము, సౌఖ్యము కలిగించి, దేశసంపదను వృద్ధిచేసి ఆర్థిక పారిశ్రామిక వ్యాపారములకు వాడి

జ్యాభివృద్ధికెట్లు తోడ్పడగలదో విదగ్ధపూర్వకముగ నిరూపించు నుత్తమ గ్రంథము.

ఇందు ప్రజల ఆర్థికస్థితిగతులు, అర్థసంపద, జనుల దామాషా ఆదాయము, విద్య, ఆరోగ్యము, ఆయుర్దాయము, వ్యవసాయము, భూసారము, పాడిపంటలు, ఉత్పత్తులు, రైతులస్థితిగతులు, ఋణభారము, దేశీయపరిశ్రమలు, వాణిజ్యవ్యాపారములు, ఎగుమతిదిగుమతులు, పెట్టుబళ్లు, రాకపోకమార్గములు, ప్రభుత్వాదాయవ్యయములు, పన్నులపద్ధతి మున్నగు అనేక విషయములందు భారతదేశమును ప్రపంచములోని ఇతర నాగరకదేశములతో పోల్చి చూపు అంకెలజాబితాలును (Comparative statistics) భారతదేశమీ యీ విషయములందు అధోగతిలో నుండుటకుగల కారణములను ఈదుస్థితి తొలగించుటకుగల మార్గములను నిరూపించి చూపు వ్యాఖ్యానములును గ్రంథప్రమాణములతోసహా భారతదేశ స్థితిగతులు అను 68 పుటల అనుబంధమున చర్చింపబడినవి. పాశ్చాత్యదేశములందలి సహకారము మనదేశమునందువలె అప్పులిచ్చు పరపతిసంఘములుగ మాత్రమే అంతముగాక వస్తునిలయరూపమునను బ్యాంకిరూపమునను బయలుదేరినను వస్తూత్పత్తిక్రయవిక్రయ వ్యాపారసంఘములుగను, కృషిపాడిపంటల సంఘములుగను, ఆరోగ్య విద్యాభివృద్ధి గ్రామపునర్నిర్మాణ శ్రేష్ఠతరజీవన సంఘములుగను, శాఖోపశాఖలుగ విజృంభించి దేశముయొక్క అర్థోత్పత్తి, అర్థవిభజన అనుభవములకును, ప్రజల ఆరోగ్యము విజ్ఞానము సౌఖ్యము పెంపొందించుటకును తోడ్పడి, దేశములోని వాణిజ్యవ్యాపారములు, పరిశ్రమలు వ్యవసాయ కృషి విద్యాలయములు, ఆరోగ్యాశ్రమములు, అనువత్తులు, పత్రికలు, భీమావ్యాపారము - ఇది యది యననేల! జనులయొక్క ఆర్థిక సాంఘిక జాతీయాభివృద్ధి కావశ్యకములగు సమస్తకార్యములను నిర్వహించుచుండుట యీగ్రంథమున చూపబడియున్నది. ఇంగ్లాండులోని సహకారోద్యమమునకు మేలుబంతియగు రాక్డేలు సహకారోద్యమ 'చరిత్ర విశేషములుగా వర్ణింపబడినది. పాశ్చాత్యదేశములందు సహకారోద్యమ మేయే రూపములుదాల్చి పనిచేసినదియు గమనించి మనదేశప్రజలుగూడ ఆయా విధానముల ననుసరించి పనిచేసినచో మనదేశముగూడ శీఘ్రకాలము నందే సర్వతోముఖాభివృద్ధినిగాంచునని నిరూపించుటయే ఈ గ్రంథము

ఐరిషుఫ్రీస్టేటురాజ్యముల కా స్వాతంత్ర్య మెట్లు లభించినది? బ్రి
సామ్రాజ్యము ఇంగ్లాండు అధినివేశములు కలిసిన భాగస్వామ్య మెట్లయి
స్వరాజ్యము పొందునాటికి అధినివేశములకు స్వరాజ్యార్హత యుండె
స్వరాజ్యమువలన నవి పొందుచున్న రాజకీయార్థిక సాంఘిక ప్రయోజ
లెట్టివి? ఫెడరల్ లేక సంయుక్తరాజ్యాంగ మన నేమి? సమప్ర
నిర్వాచనపద్ధతి (ప్రొపోర్షనల్ రిప్రజెంటేషన్) ప్రజాప్రభుత్వమున
తోడ్పడును? అను విషయములెల్ల బాగుగా చర్చింపబడినవి. వివిధదేశ
యొక్కయు అధినివేశములయొక్కయు స్థితిగతులు సాదృశ్యవైదృ
లను తెలుపు స్థితిగతిలెక్కలు (Statistics) అంకెల పట్టికలు 36 క
ఈ తరుణమున ప్రతి రాజకీయవిద్యార్థి రాజకీయవేత్త ప్రతి ఆంధ్రు
చదువవలసిన పుస్తకము. ఇండియాబిల్లుయొక్క మంచిచెడ్డలు, గవ
గవర్నరుజనరలుల అధికారములస్వభావము, రక్షణలు, మినహాయింపుల
లాభనష్టములు చక్కగా గ్రహించుట కీగ్రంథము తోడ్పడగలదు.
విజ్ఞాన చంద్రికలోని నలుబదవకుసుమము. 250 పుటలు. దీనిని ప్ర
చుము ఆంధ్రపత్రిక 2-9-33 తారీఖున సంపాదకీయవ్యాసము వ్రా
హిందూపత్రికయు పొగడినది.

సాదాప్రతి రు 0—8—0; మేలుప్రతి రు 0—12—

## అధినివేశస్వరాజ్యమును గూర్చిన పత్రికాభిప్రాయములు:

ఆంధ్రపత్రికసంపాదకీయవ్యాసము. ది 2—9—33

“... గ్రంథకర్తలు వివిధ అధినివేశరాజ్యముల స్వభావ
చక్కగ వివరించిరి. భారతదేశమునకు స్వరాజ్య మొసగుటకు గాను
బడు ఆక్షేపణ లెవ్వియు నిలుకడలేనివని గ్రంథకర్తలు కెనడా మొ
రాజ్యములచరిత్రనుండి ఉదాహరించిరి. ... గ్రంథకర్తలు వివిధరాజ్య
లెట్టుల నభివృద్ధిగాంచెనో చక్కగ వివరించి హిందూదేశము
స్వరాజ్యసిద్ధికిఓమ్మట నభివృద్ధిజెందుట కెట్టియవకాశములు గలవో
వరచిరి. ఈచరిత్రను భారతీయు లీసమయమున బఠించి నిజస్థితిని గ్ర
చుట యుక్తమగును. ప్రజలలో నీవిషయము కరతలామలకము గా
బడెను. ఆంగ్లభాషరాని ఆంధ్రుల కీగ్రంథము మిగుల నుపయుక్త
ముండగలదు.”

## భారతదేశస్థితిగతులు

“భారతదేశ స్థితిగతులు, వివిధదేశముల అర్థసంపద,
గతులు, వాణిజ్య వ్యవసాయ ప్రకృతిపరిశ్రమలు, ప్రభుత్వా
పద్ధతులు పోల్చిచూపు అంకెలపట్టికలు విషయములప్రక
కరింపబడినవి. “చదువుకొన్నవా రందరు ఎల్లప్పుడు చేతనుంచు
గ్రంథము”—వ్రాసినది. 72 పుటలు. వెల రెండుఅణా

## ఆంగ్లరాజ్యాంగము

ఇది ఇంగ్లాండుదేశపు పార్లమెంటుప్రభుత్వవిధానములను గూ
చిన్నగ్రంథము.. రాజ్యాంగశాస్త్రము నభ్యసింపగోరువారికి మిక్కిలి
వెల ఒకఅ
యుక్తము. 30 పుటలు.

## అంకుల్‌టామ్ కథ

అమెరికా నీగ్రోబానిసల ఘోరస్థితిగతులు దెలుపు “అంకుల్
టామ్సు క్యాబిన్” అను సుప్రసిద్ధ ఆంగ్లనవలకు అనువాదము.
వెల ఒక అణా
34 పుటలు.

వలయువారు:—
దిగవల్లి వేంకటశివరావు, బి. ఏ., బి. యల్., బెజవా